Registered No. M-4484.

# యుద్ధ సంచిక

వాల్యూం II.] 1942 వ సం॥ అక్టోబరు నెల 9 వ తేది శుక్రవారం [నె 40 రు.

## రష్యా విమాన విధ్వంసక ఫిరంగులు.



✻

రష్యా నౌకాదళమునకు చెందిన సైనికులు విమానాలను కొట్టే ఫిరంగులను సిద్ధం చేస్తున్నారు. నాల్గు బారల్సుగల బరువైన మర ఫిరంగి.

✻

# పని ఉన్నవారు పోరాదు.

## పోదలచినవారికి ప్రభుత్వంవారి ఏర్పాటులు.

సైనిక అవసరాలకు అడ్డుతగలరాదు.

శత్రువుల యుద్ధ నౌకలున్ను సేనలతోకూడిన యితర నౌకలున్ను గత ఏప్రిలుమాసంలో బంగాళా ఖాతంలోకి వచ్చుసరికి మదరాసు ప్రభుత్వంవారు ను, ప్రజలును అతి త్వరగా నిర్ణయించుకోవలసి వచ్చెను. అప్పటికి సిద్ధంగా నుండకపోవుట సహజం కనుక, ఉభయులు వేరువేరుగ తలంచిరి. ఆ ప్రకారం జరిగిన పనులు అందరికి సంతృప్తి కరంగా లేకుండెను.

ఇప్పటి కది జరిగి ఆరు మాసాలు గడిచింది; వర్షాలు వచ్చిపోయినాయి; జపానువారు యింకా బర్మాలోను అండమానులలో నున్నారు కనుక, ఇదివరకు చికాకు కలిగించిన ప్రమాదం తిరిగి వస్తుందేమోనని ప్రజ లనుకోడం భావ్యం. వస్తే ఎదుర్కో డానికి యీ మధ్యకాలంలో ఏమిచేసేరు అని ఆశ్చర్యపోతారు.

చాలపని జరిగిందన్నదే ఆ ప్రశ్నకు సరియైన జబాబు. శత్రువు నేలపై దిగి దాడిచేయుట గాని, గాలివాటుగా విమానదాడిగాని జరుపక పోవచ్చును; కాని జరుపడానికి అవకాశం లేక పోలేదు. కనుక ఒకవేళ శత్రుదాడే జరిగితే చేయవలసిన పనులగూర్చి, సివిలు, మిలిటరీ, నేవలువారు ప్రంటు అధికారులందరు కలసి ఆలోచించి తగు విధానం నిర్ణయించియున్నారని ప్రజలకు చెప్పవచ్చును.

ఇపుడు రెండు ముఖ్య విషయాలు గమనించాలి. ఒకటి ప్రజల కట్టుబాటు, రెండోది సైనిక సమర్థత. రెండోది మొదటిదానిపై ఎక్కువగ ఆధారపడింది. పనులున్నవారు పారిపోకూడదు. ఎక్కడున్నవారు అక్కడే ఉండండి, అని జాతీయ యుద్ధరంగంవారు యీ రాష్ట్రంలో కొంతకాలంనుండి ప్రచారం చేస్తున్నారు. కావున మదరాసు వాసులు అట్లు చేయాలని యీ వ్యాసం ద్వారా ప్రోత్సాహించడం సమంజసంగానుండును. గత ఏప్రిలులో అనుకోకుండా, సదుపాయాలు చూసుకోకుండా నగరం విడిచి నిరుపయోగంగా పారిపోయి కష్టనష్టాలకు పాలయినవా రెందరో

గలరు. కనుక నిలచి ఉండండి అనే ప్రబోధం అందరు అనుసరింపదగ్గదే.

అధికారులు చెప్పంది అనాలోచితంగా పారి పోవడంవలన మామూలు జీవితానికి ఎన్నో ప్రతి బంధకా లేర్పడతాయి - ఫ్యాక్టరీలు నిలచిపోతాయి, సప్లయిలు అందవు, యుద్ధయంత్రం నిరోధింప బడుతుంది ; సంఘానికి సామాన్యంగా ఉపయోగ పడు ప్రతివాడును తన పని వీడరాదు. చాల పిన్నవయస్కులు, అతివృద్ధులు, ఆడవారి వెంట పోక తప్పని సరిగ నుండువారు, తమ పనులను మానుకొని పోవచ్చును. పనులు సౌకర్యాలు ఉండి, దుకాణాలు తెరచియుండి, బేరాలు సాగు తువున్నచోట, ఎ.ఆర్ పి. రక్షణ, వైద్యసహా యం, పోలీసు కాపలాలు ఉన్నచోటనే ఎక్కువ భద్రంగా నుండగలమని ప్రతివానియొక్క స్వార్థ చింతయే చెప్పగలదు. ఇండ్లు లేక, రక్షణ లేక తెలియని రైల్వే స్టేషనులలో ఆకలిగొన్న పాం థులవలెను, లేదా క్రొత్తవారితో నిండిన మారు మూల గ్రామాలలోను నివశించుటకంటెను, రక్షణ లున్నచోటనే ఉండుట మంచిది. పురజనులు ఉన్న చోటనే ఉంటే, అందరి వ్యాపారాలు యథేచ్ఛగ జరుగగలవు.

సైనిక సమర్థత

ఇంకో ముఖ్యవిషయం - సైనిక సమర్థత - ఎంతగలదో అందరికి తెలియకపోవచ్చును గాని, అది చాల ముఖ్యమయినది. మన రక్షణకు లేదా శత్రునిర్మూలనకు ఎంత మనకు ఆయుధ సైనికశక్తియున్నదో అందు కొంతైన యీ మదరాసు వాసులకు చూపబడినది. మదరాసుకి చేరువలో పెద్ద సైన్యముగలదు. ఆ సైన్యం సమర్థతో పనిచేయాలంటే స్వేచ్ఛగ విహరించు టకు ఎంత జాగా కావాలో, నిర్నిరోధమగు మార్గాలు ఎన్నియుండాలో సామాన్యులకు తెలి యదు. రైళ్లు, రోడ్లు, వంతెనలు, టెలిగ్రాములు మున్నగు రాధారులన్నింటిని వాడుటకు సైన్యా నికే మొదటిహక్కు ఉండితీరాలి, దాని కడ్డుండ రాదనుట సిద్ధాంతమే. ఈ త్రోవలలో సివిలు ప్రజలు నిండి అడ్డునిలచుటను వారు సహింపరు. సైనికులు యుద్ధరంగాలకు వడిగా పోవడానికి వీలులేకుండా త్రోవలో జట్కాలు, ఎద్దుబండ్లు, సామానుబండ్లు గుంపులుగనుండ వీలులేదు. తమ ఆయుధబలంతో శత్రువును ఎట్లు ఎదుర్కొని ఓడించడం అన్నదొక్కటే సైనికు లాసమయ మున ఆలోచింపవలసిన విషయం. జపానువారు రాకపోయినా, వారు వస్తారని ఎంచియే యీసైని కులు తయారుగ నుండాలి. కావున ఏ సివిలు ప్రజలను రక్షించుటకు యీ సైనికులు యిక్కడికి వచ్చేరో ఆ సివిలు ప్రజల మామూలు సౌకర్యాలను సైనికుల సౌకర్యాల తరువాత చూడవలసినవేగాని, ముందు కాదు. అందుకనే సైనికాధికారులు గూడ "ఉన్నచోటనే ఉండండి" యను ప్రబోధ మును మనస్ఫూర్తిగ బలపరస్తున్నారు.

ఇది సరియైన సలహాయేనా? ప్రమాదం వస్తె సివిలు ప్రజల సౌకర్యాలకు, సైనికుల సౌకర్యా లకు అడ్డులేకుండా మదరాసు ప్రజలు స్థిర చిత్తంతో నుండగలరా? అన్న సందేహాలుండ వచ్చును. అట్లు సందేహించువారు రెండు విమానదాడులు జరిగి ప్రజలకు భీతాహం కలిగిం దనుకోండి. ఒకేసారి అకస్మాతుగా ఎక్కువ మంది వృద్ధులు, స్త్రీలు, బిడ్డలు పారిపోదలచి రనుకుందాం. అపుడు ప్రభుత్వంవారు ఏమి చేసేరని బాహాటంగా అడిగేవారుంటారు. గత సారి ఏప్రిలులో శత్రువు బంగాళాఖాతంలోకి రాక పూర్వం రెండు నెలల క్రిందటనే తాత్కాలికంగా నుండదగ్గ పెద్ద నివాసములను చాల ప్రభుత్వం వారు కట్టిరన్న విషయం పలువురు మరచిపోయిరి. అందు ఆహారపదార్థములు, నీరు, వైద్య,ఆరోగ్య సౌకర్యములన్నీ ఒనగూర్చబడెను. మదరాసు నుండి నడిస్తే 24 గంటలలోగా చేరగల్గినంత దూరంలో ఆరు చోట్ల సాలలు కట్టియుంచిరి. అందులో 3,60,000 మందికి ఒక వారంవరకు సరిపోవు బియ్యం, కూరలు, నీరు అపుడుంచ బడెను. అటుతరువాత అవి వున్నచోటులు ఆశ్రయమిచ్చు కాలము మార్చబడినను, అప్పటికి యిప్పటి ఆరు నెలలు గడిచింది కనుక, అప్పటి కన్న యిపుడు ప్రజలను పంపివేయుటకు 'ఎవా క్యుయేషను' ఏర్పాటులు ఎక్కువేగాని తక్కువ గావని ఎంచవచ్చును.

ఇప్పటి ఏర్పాటులు.

పడమటకు పోవు దారిలో పిరికిగ పారిపోవు బాటసారులు ప్రతి 20 మైళ్లవద్ద విశ్రాంతి గైకొను టకు తగు ఏర్పాటులు చేయబడినవి. (ఆరో డ్డేదో ముమ్ముందు వ్యవధియుండగానే ప్రకటించ బడును.) కాని అట్లా పోయేవారికి రైళ్లుండవు : అన్ని బండ్లు అత్యవసరమగు రవానాలకు మిలి టరీవారికి ప్రత్యేకించబడును. మిలిటరీవారి మార్గా నికి అడ్డురాని త్రోవలోనే పోదలచిన ప్రజలు పోవాలి. అంతేకాక సామాను చాల కొద్దిగా

# యుద్ధ విమర్శ.

ఇండియా రక్షణపద్ధతినుండి దాడి చేసే స్థితికి మారుట

ఇండియాలోని సైన్యాలు దేశరక్షణ చేసుకునే విధానం స్థితినుండి శత్రువుపై దాడిచేసే స్థితికి మారుటను గూర్చి భారత సర్వసేనాధిపతి చెప్పిన విషయం గత వారం యుద్ధ సంచికలో ప్రకటించబడింది. క్లుప్తంగా తెలుపుటయందు, జాగ్రత్తగ భావిసూచన చేయుట

---

పట్టుకోవాలి. ఏమంటే ఒక్క రోడుమీద కొంచెం దూరంవరకే చక్రాల బండ్లను పోనిస్తారు, అదిదాటి ఎటువంటి బండిని పోనివ్వరు. త్వరగా ఏదారినుండేనా తొలగిపోగల మోటారులను మాత్రం పోనిస్తారు. నడవదలచిన వారు చాలదూరం నడవాలసియుండును. ఏమన ప్రభుత్వ రక్షణశాలలలో ఒక్క రాత్రికన్న ఎక్కువ వుండుటకు వీలుండదు. చాల కష్టంగానుండదూ? అవును నిజమే. పోక తప్పనిసరి వచ్చినపుడు ఎపుడు ఎట్లు పోవాలో ప్రజలకు చెప్పదలచిన ప్రభుత్వం, అనవసరంగా ముందుగ పోయేవారికి ఎక్కువ సౌకర్యములు చేయజాలదు.

సంగ్రహంగా చెప్పాలంటే: (1) ప్రమాదం రానేరాదు. వచ్చిందంటే మిత్రులకు సంఘానికి తన కచేరికి పనికివచ్చు ప్రతివాడు ఉన్నచోట నుండుట తనకు, ప్రభుత్వంవారికీ, సైన్యానికి గూడ శ్రేయస్కరము. (2) వదంతులు భయము ప్రబలి పిరికివారు వెడలిపోదలచినచో వారికి తగు ఏర్పాటులు ప్రభుత్వంవారు చేసేరు. (3) అతి ఘోరం సంభవించి యీ పురాతన నగరమగు మదరాసు విడచి పోవలసివస్తే (దేముని ధర్మాన అంతపని జరుగనే జరుగదు) అందుకుగూడ తగు యేర్పాటులు ప్రభుత్వంవారు చేసిరి. (4) ఈ యుద్ధ సమయంలో యీ యేర్పాటులన్నీగూడ ముందు సైన్యం అవసరాలు గమనించి జరుపవలసినవే. ప్రజలు తెలివిగ ప్రవర్తిస్తే, ప్రజారక్షణకొరకు జరిగిన ఏర్పాటులకు సైన్యం అడ్డుతగల్దు. కాని సైనికచర్యలు చేయవలసినపుడు వారి నియమాలన్ని సామాన్య ప్రజలుకూడా తప్పకుండ అనుసరించాలి. సిపాయిలే అతి కఠినంగా వాటిని అమలు జరిపెదరు. మనమంతా-యీ నగరంలో రాష్ట్రంలో నున్నవారమంతా యుద్ధంలో నున్నాము. ఈ యుద్ధం ప్రజలందరికి సంబంధించిన యుద్ధమనుటకు యిదో నిదర్శనం.

యందు, ఆకస్మికంగా చర్య గైకొనుటయందు పేర్గన్న వావెలుగారు, బర్మాపై దాడిచేయుటకు ఇండియా సిద్ధంగా నుండాలన్నారు. అయినను, బర్మానుండి ఇండియాపైకి జపాను సేనలు దాడి చేసే అవకాశం లేకపోలేదు. కాని ఇండియా నుండి బర్మాపైకి మిత్రమండలి సేనలు దాడి చేయుటకు యిపుడు పూర్తిగ అవకాశం గలదన వచ్చును. ఆరు నెలలక్రిందట వావెలు సేనాని మలయాలో జరిగిన పొరబాటులన్ని బాహాటంగా ఒప్పుకొని, యింకా ఎక్కువ నష్టాలు కలుగ వచ్చునని చెప్పినా, తన శక్తియందు ప్రజలకు విశ్వాసం వృద్ధిఅయ్యేటట్లే మాట్లాడేరు. బర్మాను తిరిగి ఆక్రమించుటగూర్చి విశ్వాసపూర్వకంగా పలకడం, అందుకు తాను కొంతకాలంనుండి తగు ప్రయత్నం చేయుచున్నానని చెప్పడంబట్టి చూస్తే త్వరలో ఏదో పెద్దఎత్తు వేస్తున్నారనుటకు ఎట్టి సందేహంలేదు. వెండలు విల్కీగారు గత ఆదివారం చుంగ్‌కింగు నగరంలో ఏషియా ప్రాంతాలందు పెద్ద పురోగమనదాడి జరుగుట రెండో యుద్ధరంగం వంటిదేయని అన్నపుడు, వావెలుగారు చెప్పిన యీ దాడినే ఉద్దేశించియుందురు. ఇండియాలో మిత్రమండలి సైన్యాలును విమాన దళాలును వృద్ధిచేయబడుచున్నాయి. బర్మానుండి జపానువారిని తరిమేయాలి, స్వతంత్ర చీనాకు దిగ్బంధం తొలగించాలి. అప్పుడుగాని మార్షలు చియంగుకాయి షేకుగారి సేనలు జపానుకి దాని దక్షిణ సామ్రాజ్య దేశాలకు మధ్య బల్లెపు పోటువలె నుండజాలవు.

* * *

భూదగ్ధ విధానం ఇండియాలో ఉండదు.

జపాను దాడిని నిరోధించుటకై చీనా అద్భుతంగా ఐదు సంవత్సరముల నుండి పోరాడుచున్నది. చీనా నిధికొరకై లండనులో జరిగిన సభయందు చీనా ప్రతినిధిగా లండనులోనున్న రాయబారి డా॥ వెలింగుటను కూగారు, చీనా యుద్ధంగూర్చి వివరంగా తెలిపి, చీనా ధర్మంకొరకు పోరాడుచున్నందునే, యిపుడు స్వాతంత్ర ప్రియులందరు చీనాకు సహాయం చేయుచున్నారనియు, చీనా నిరోధమిపుడు ప్రజా ప్రతినిధి ప్రభుత్వాలకు నిరంకుశ బర్బరులకు జరుగుచున్న యుద్ధంగా మారిపోవుట సంతసింప దగియున్నదనియు చెప్పిరి. చీనా

యుద్ధంలో ఒక ముఖ్యమయిన పద్ధతి భూదగ్ధ విధానం. రష్యాకూడ యీ విధానమునే జయప్రదంగా కొనసాగించెను. దీనిగూర్చి యిపుడు ఇండియాలో వాదోపవాదములు జరుగుచున్నవి; అక్ష రాజ్యాలు దీనిగూర్చి అసత్యాలు ప్రచారం చేయుచున్నవి. ఈ పద్ధతి ఇండియాకు అనుకూలించదు. భూదగ్ధ విధానమంటే, సైనిక ప్రయోజనంగల వంతెనలు, రైల్వేలు, మందుగుండు కర్మాగారములే కాక, పంటలు పొలాలు, ఇండ్లు గ్రామాలుకూడ తగలపెట్టి ప్రజలు పారిపోవుట. చీనావారు ప్రజలు తండోపతండాలుగ ఒక్క వూపుని పడమటి చీనాకు యిట్లే పారిపోయిరి. శత్రువుకి సైనిక సౌకర్యాలు యివ్వక పోవుటకును, భూదగ్ధ విధానమునకు వ్యత్యాసం ఉంది. స్టేటు కౌన్సిలులో సెప్టంబరు 26 వ తేదిన ప్రశ్నలకు ప్రత్యుత్తరం చెప్పుచు జనరలు హార్టిలీగారు భూదగ్ధ విధానానికి బదులు, శత్రువుకి సహాయకారిగనుండు వస్తువులన్నీ నాశనంచేసి వానికి సదుపాయాలు లేకుండా చేసే పద్ధతి అనుసరింపబడుననిరి. సివిలు ప్రజలు బ్రతికియుండుటకు అవసరమగు వస్తువులు నాశనం చేయుటకును, శత్రువుకి సహాయకారిగా నుండేవి నాశనం చేయుటకును వ్యత్యాసం ఉంది.

* * *

ఇండియాలో తిరుగుబాటు దారులపై విమాన ఫిరంగులు.

ఇండియాలో నగరాలపై బాంబులువేసి నాశనం చేస్తున్నారని అక్షరాజ్యాలు చేస్తున్న ప్రచారాన్నిగూడ జనరలు హార్టిలీగారు ఖండించిరి. తిరుగుబాటు చేసిన జనసమూహములను ఆగస్టు 9 వ తేదిన విమానాలనుండి మరఫిరంగులు పేల్చి చెదరగొట్టితిమని వారు చెప్పిరి. బీహారులో బెంగాలులో నాల్గు చోట్లను ఒక దేశీయ సంస్థానమునందు యిట్లు చేయబడినది. ప్రతిచోట నేరం నిరోధించుటకేగాని శిక్షించుటకు యీపని జరుగలేదు. ఒకవిమానం అల్లరిమూక నెత్తిపై ఎగిరి మరఫిరంగులను గురిచూచి, సరిగా అల్లరిచేయుచున్న వారిని మాత్రమే గుండ్లతో ప్రేల్చుటకు వీలుంది. అన్ని సారులును ఫిరంగులు యుక్తాయుక్త విచక్షణతో ప్రేల్చబడినవేగాని గ్రుడ్డెద్దు చేనులో పడ్డట్టు జరుగలేదు. ప్రజల గుంపును చదరగొట్టుటకు విమానాలనుండి బాంబులు వేయ వీలు లేదు. వేసినచో చాలమందికి గాయమగును. జనుల గుంపుకు హానికల్గించనిది, బాంబులు వేయ వీలులేదు. కనుక ప్రజలు నివశించు ప్రాంతాలలో బాంబులువేస్తే చూసుకోకుండా పడేయాలి. గురిలేకుండా బాంబులు వేసే పద్ధతి అక్ష రాజ్యాలది: విమానాల పైనుంచి మరఫిరంగులను గుంపులపై ప్రేల్చుట మిత్రమండలి పద్ధతి. ఆక్రమించిన యూరోపు దేశాలలో ప్రజలను డైవు బాంబరులతోను, టాంకులతోను అణచియుంచుదునని జర్మను విదేశాంగ మంత్రి రిబెనుట్రాఫ్‌గారనియుండిరి. దీనితో పోల్చిచూచిన ఇండియాలో అనుసరించిన పద్ధతి నేరం నిరోధించడానికి విచక్షణతో చేసిన పనిగాని, నిర్లక్ష్యంగా హింసించుటకాదు. అనగా అల్లరి అణచుటకు ఎంత బలం ఉపయోగించాలో అంతే ఉపయోగించవలెం దన్నమాట.

* * *

జపాను తిన్న పరిగించుకోవాలి.

జపాను తరువాత ఏమిచేయనుంది? దూరప్రాచ్యంలో జరుగుచున్నదాని బట్టి, యిపుడు జపాను, ఆస్ట్రేలియాలోని మిత్రమండలి శిబిరాలకు అమెరికానుండి సరకులు రాకుండా రాధారులు అడ్డుటకు సర్వవిధముల ప్రయత్నించుచున్నదని తెలియగలదు. నైరుతి పశిఫికు సముద్రమునందు జపాను సేనలు కేంద్రీకరించబడుచున్నాయి; సోలమను దీవులందు తిరిగి ప్రవేశింప అనేకసారులు ప్రయత్నించుచున్నారు; మార్సుబీ రేవుపై తరుచు దాడి చేయుచున్నారు. ఇవన్నీగూడ జపాను ఉద్దేశాలను స్పష్టపరచుచున్నవి. తమ సేనలు ఆక్రమించిన ప్రదేశాన్ని నిలబెట్టుకోవడమే వారి ముఖ్యోద్దేశంగా నుంది. ఇండో-చీనానుండి ఇండియా-బర్మా సరిహద్దులవరకున్ను, ఫిలిప్పైను దీవులనుండి న్యూగినీ వరకున్ను విశాల ప్రదేశ మాక్రమించుకొనబడింది. ఈ ప్రాంతాలకు నాల్గు వైపులనుండి దాడి ప్రమాదం గలదు. ఉత్తరాన వ్లాడివిస్టాకు నుండి రష్యావారి దాడి, పశిఫికు సముద్రంనుండి నౌకాదళం దాడి, పడమట ఇండో-బర్మా సరిహద్దులనుండి నేల సైన్యాల దాడి, దక్షణాన ఆస్ట్రేలియానుండి దాడి జరుగవచ్చును.

రష్యాతో బాహాటంగా జపాను యుద్ధంలోకి దిగేవరకు ఉత్తరంనుండి ప్రమాదం ఉండదు. సైబేరియాపై జపానుదాడి వెళతుందని కొన్ని వారాలనుండి వదంతులు ప్రబలియున్నాయి. జపాను సేనలు ¼ వంతు ఉత్తరాన యిందు

(మిగతా 6 వ పేజీలో)

# నౌకలముంపుకన్న నిర్మాణం వడిగ జరుగుచున్నది.

## సరకు సప్లైకి నౌకలు చాలకుండుటే ప్రతిబంధకం.

రష్యాకు ఇంగ్లాండునుండి అమెరికానుండి పోతున్న యుద్ధ సామగ్రి నౌకలజట్టును తమ విమానాలు జలాంతర్గాములు ముంచువేశాయని బెర్లినునుండి అనేకసార్లు అతిశయోక్తిగా ప్రకటించబడు చుండును. అది నాజీ జర్మను అధికారుల ఆశను ప్రకటించునేగాని నిజంకాదు.

మాల్టాకుపోయిన చిట్టచివర కాన్వాయికూడ అక్ష రాజ్యాల వాయు వార్తలలో నాశనంచేయబడినా, సరకేమో మాల్టాకు భద్రంగా చేరినది. రష్యాకు యిపుడు చాల సరకు అవసరం. ఇటీవల రష్యాలో మందుగుండు, ఆయుధాలవాడుక విపరీతంగా పెరిగిపోయింది. స్టాలినుగ్రాడు యుద్ధంలో చాల ఖర్చయింది. పైగా జర్మనులు వాల్గా కాకససులమీదకు త్రోసుకొని వచ్చుచున్నందున రష్యాకు ముడిపదార్థములుగూడ అందకుండా పోతున్నాయి.

రష్యా సేనల ధైర్య సాహసములకు తోడుగ తగినట్లు సంయుక్త రాజ్యాలు ఎన్ని విధాల సహాయం పంపగలిస్తే అన్ని విధాల పంపించాలి.

అమెరికా బాంబరు విమానాలు కొంతకాలం నుండి జర్మనీపై దాడులు జరుపుచున్నవి. త్వరలో వారి ఎగిరేకోటల సంఖ్య రెండు మూడింతలు వృద్ధిచేయబడును. రష్యాలో యుద్ధంచేస్తున్న జర్మనీ సేనలకు సప్లయిలు ఎక్కడనుండి పోతాయో ఆ జర్మను కేంద్రాలపై జరుపునటువంటి యీ విమానదాడులు, రష్యా యుద్ధ రంగాలకు సరకు సప్లయిచేయుట తోబాటు, ఎంతో మేలు చేయగలవు.

ఎర్ర సముద్రము, పెర్షియను గల్ఫు చాల దూరాన ఉన్నవి. అక్కడకు సామానులు పంపుటకు నౌకలు అవుసరము. అంతేకాక ఇరాను, ఇరాకులకు నేల మార్గాలుకూడ అభివృద్ధి చేయవలసియుంది. ఆఫ్రికా ప్రాంతీయులు మధ్య ప్రాచ్యములందలి యుద్ధమునకై అనేక విమానాలు, టాంకులు, ఫిరంగులు, హార్బరు కట్టడములు, ఇంజనీరింగు పనులు కావలసియున్నవి.

చీనాకు విమానాలు యుద్ధ పరికరాలగు యంత్రసహాయం కావలసియుంది. ఇండియా, ఆస్ట్రేలియాలుకూడా యీ సహాయం కోరుటకు హక్కుగలదు. ఈ దేశాలన్నింటికి సరఫరాలు చేయుట ఉత్పత్తి చాలక పోవుటవలనకాక, మోసుకపోయేందుకు నౌకలు లేక పరిమితముగ నుండును. పెద్ద బాంబరు విమానాలు వాటంత నవిఎగిరి వేలకువేల మైళ్లు పోగలవు. అమెరికాలోని బ్రేజిలునుండి పడమట ఆఫ్రికాకు పోగలవు. కాని ఫైటరు విమానాలుమాత్రం పెద్ద సముద్రాలను నౌకలపైనే దాటగలవు. విమానాలకు కావలసిన నేలసరంజామా అంతా నౌకలపైనే పోవాలి. టాంకులు, బరువైన ఫిరంగులకు స్టీమరులలో ఎక్కువజాగా కావాలని వేరే చెప్ప నక్కరలేదు.

### ఉత్పత్తి హెచ్చుట.

ఇపుడు జలాంతర్గములను నౌకా నిర్మాణ కేంద్రాలు ఓడించినవి. జలాంతర్గములు ముంచివేయుచున్న స్టీమరులకన్న ఎక్కువ నౌకలు నిర్మింపబడుచున్నాయి. తమ జలాంతర్గముల కష్టాలగూర్చి యిటీవల జర్మను రేడియోలు విలపించుట చూస్తే వాటిలో వారి నమ్మకం తగ్గిపోతున్నదని తెలియగలదు. అయినను నాజీలు జలాంతర్గముల నిరోధం కల్పించిన సముద్రాలలో ప్రయాణం చేయునపుడు మనం కొన్ని నౌకలు గోల్పోవలసి యుంటుందని నిశ్చయం చేసుకొనే యుండాలి. నౌకాదళం వారును, వర్తక నౌకల నావికులును చాల అద్భుతమయిన తెలివితేటలూ నేర్పుతో ప్రయాణాలు చేసినను నాజీ తత్వం నశించేవరకు సముద్ర మార్గాలు నిర్భయములనుటకు వీలులేదు.

సంయుక్త రాజ్యాలకు యింకా యింకా ఎక్కువ నౌకలు కావాలని అధ్యక్షుడు రూజువెల్టుగారు చెప్పియుండిరి. అటుతరువాత యింకా కొన్ని నౌకలు మునిగిపోయినందున యీ అవసరం మరీ ఎక్కువయింది. మధ్య ప్రాచ్యంలో యుద్ధ రంగాలకు మన సరకు ఆఫ్రికా కొసనున్న కేపు టవును చుట్టిపోవాలన్నా అమెరికా తీరాలనుండి పశిఫికు సముద్రంమీదుగా రావాలన్నా నౌకలు చాల నెలలపాటు సముద్రాలపై ప్రయాణం చేయాలి.

"అక్ష రాజ్యాల గుండెపై దెబ్బకొట్టే వ్యూహాన్నే మిత్రమండలివారు ఆలోచించాలని" రూజు

వెల్టు గారన్నమాటలనే యుద్ధ కార్యాలు నిర్వాహక వర్గంవారు ఆదర్శంగా నుంచుకోవాలి. మిత్రమండలికి ఉన్నశక్తిని ఉపయోగించి బాగా లాభం పొందాలంటే శత్రువుకి యెక్కడకొడితే ఎక్కువ నష్టం కలుగుతుందో అక్కడ కొట్టుటకు ఆ శక్తిని ఉపయోగించాలి. జర్మనీ పరిశ్రమలకేంద్రాలపై విమానదాడిని వృద్ధిచేయుటకు మించిన సాధన వేరొకటి లేదు.

---

[4 వ పేజి తరువాయి]

కొరకై ఉంచబడినవి. కాని సోవియటు రష్యా యిందుకు సిద్ధంగానే యుంది. ఎర్ర సైన్యాలు దూరప్రాచ్యాన పూర్తి పరికరాలతో అజేయంగా నున్నవి. స్టాలినుగ్రాడునకు సైబేరియానుండి వచ్చిన సైన్యాలు పడమట సైబేరియానుండి వచ్చినవిగాని తూర్పునుండి కాదు. అయినా జపాను తన ఉద్దేశం వదలుకోదు. టోకియో నగరానికి వ్లాడివ స్టాకునుండి విమానదాడి జరిగే అవకాశం లేకుండా ముందు చూసుకోవాలని జపాను వుద్దేశం. అయితే, రష్యా జపానుపై దాడి చేయదలచిం దనుకొన్నపుడే యీ భయం వుంటుంది. ఏడాది క్రిందట పడమటను తన సేనలు పూర్తిబలం కలిగియున్నపుడే యీపనిచేయని రష్యా, యిపుడు అక్ష రాజ్యాల పోరులో చావు బ్రతుకులు తేలకుండా యున్నపు డేమి చేయగలదు.

రష్యాపై జపాను వైఖరిఅంతా జర్మనీ ఎంత వరకు రష్యాను ఓడించగలదో దానిపై ఆధారపడి యుంటుంది. కొంతవరకు దక్షిణాన పడమరను మిత్రమండలివారు జపానుకి చేయగల ఒత్తిడిపైనిగూడ ఆధారపడియుండును.

ఇండియాపై జపాను దాడికి తగుయత్నా లేవి జరుగుచున్న ట్లగుపడదు. తా నాక్రమించిన ప్రాంతాల పడమటి ద్వారం మూసి బందోబస్తు చేసుకొనుటకు జపాను బర్మాకు ఎక్కువ సేనలేమీ తేలేదు. అంతేకాక చీనాలోని చెకియాంగు నుండి కొన్ని సేనలను వెనుకకు తీసుకపోయి, టోకియోపై బాంబు చేయడానికి అనువగు రెండు చీనా విమానాశ్రయాలను చీనావారికి విడచిపెట్టిరి. ఈ పని జరిగినానక చుంగికింగుపై చావు దెబ్బ కొడతామని, టోకియోనుండి ప్రగల్భాలు విన రాలేదు.

* * *

కావున పశిఫికు నైరుతి దిక్కున దాడిచేయుట జపానుయొక్క ప్రధాన కార్యంగా మిగిలియుంది. న్యూగినీ, దానికి ప్రధాన నగర మగు మార్సుబీ రేవునూ ఆక్రమించుటయు, సోలమను దీవులను తిరిగి ఆక్రమించుటయు వారి కార్యక్రమంలో ప్రధానాంగములు. ఈ ప్రాంతంలో అమెరికా ఆస్ట్రేలియాల సమిష్టి శక్తులను ఎదుర్కొనుటకు జపాను తన నౌకా విమాన సైనిక శక్తులన్ని వినియోగిస్తున్నది. మార్సుబీ రేవువద్ద తీవ్రయుద్ధం దీర్ఘంగా జరుగవచ్చును. కాని ప్రారంభంలోనే జపానువారు ఓడే సూచన లగపడుతున్నాయి. ప్రారంభ విజయాలు లేనిది వారు గెలువలేరు. మార్సుబీ రేవు యుద్ధం ముఖ్యమయిందే కాని, పశిఫికులో యుద్ధం, ఇండియా సరిహద్దులందలి యుద్ధాలు, సైబేరియా యుద్ధాలు, స్టాలినుగ్రాడు వీధులలో యుద్ధాలు అన్నీ ఒక్కలాంటి ప్రధానమైనవే యని గుర్తించాలి.

మార్సుబీపై జపాను దాడి

---

## బెల్జియంలో జర్మనీకి ప్రతికూల కుట్రలు.

బెల్జియంలో జర్మనీ పరిపాలనపై కుట్రలు తిరుగుబాటులు అమితంగా ప్రబలుచున్నవని లండనులోనున్న బెల్జియం ప్రభుత్వానికి తెలియవచ్చింది ప్రతిచోట ప్రతికూల ప్రభావాలు జరుగుచున్నవి. రహశ్యంగా దాగియున్న నాయకులు పత్రికలు యీ ప్రతికూల భావాన్ని ప్రోత్సాహించుచున్నారు. బ్రుసెల్సుకి 9 మైళ్ల దూరంలో ఆశ్చయందున్న అస్ఫాల్టు కర్మాగారం కొద్దిరోజుల క్రిందట కాల్చి వేయబడింది.

బ్రుసెల్సులో జర్మను గూఢచారులు 2,000 మంది గలరు వీరుగాక పోలీసు లెందరో గలరు. బెల్జియనులోని నాజీ సంస్థలకు దినదిన గండంగా నుంది ఇరువురు జర్మను గార్డులు బెల్జియం దేశాభిమానులచే చంపబడిరి. వారిని నాజీ పద్ధతులలో దహనంచేసిరి. అంత్య క్రియలలో ఒక ముదుసలి ప్రక్కనుండి చూస్తు సలాం చేయలేదని పోలీసులు కొట్టిరి. అది చూసిన ఒక స్త్రీ మేడమీదనుండి ' పశువులు ' అంది. వెంటనే ఆమె యిల్లు తగులపెట్టబడెను.

బ్రుసెల్సులో ఒక జర్మను కార్యాలయమునందు బాంబు రహశ్యంగానుంచుటచే, కాలి 8 గురు గాయపడిరి. రష్యా జండాలు జర్మనులు తీసేస్తూవుంటే, తిరిగి ఎగురవేయబడుచున్నాయి. బ్రుసెల్సులో 100 మంది కమ్యూనిష్టులు వినాశకరమగు కుట్రలుచేసినందున శిక్షింపబడిరి. కర్మాగారాలున్న ప్రాంతాలలో కరవు ప్రబలింది.

# మనంకూడా పాటు పడాలి.

## చీనా పత్రిక సలహా.

"యీషిపావో" అను చీనా పత్రిక యిట్లు వ్రాస్తున్నది.—బ్రిటను అమెరికాలు ప్రథమ తరగతి శక్తివంతమగు రాజ్యాలు మనకు జపానుకి ప్రతికూలంగా తోడ్పడుచున్నవిగదా, జపాను సేనలను కదలకుండా చేస్తిమికదా యిక మనకు భయంలేదు. జపాన్ను పూర్తిగ బ్రిటను అమెరికాలు ఓడించగలవు అని చీనా ప్రజలను కుంటున్నారు.

ఇట్లా బాధించడం చాల తప్పు అందువలన మన కర్తవ్యం మరచిపోయి అశక్తుల మగుదుము. ఇంగ్లాండు అమెరికాలు మనకు మిత్ర రాజ్యాలు. నిజమే కాని మనంకూడ వారికి మిత్రులమే. వారివద్ద మనం సహాయంకోరితే మన సహాయం కూడ కొంత వారు కోరవచ్చును. కావున జపానువారు చీనాబురదలో దిగబడ్డారని సంతోషించి మనం ఊరుకోరాదు. మన దేశంలో మనం చేయగలచింది చేసి, జపాను సేనలను కదలకుండా చేయడమేకాక, నాశనం చేయాలి. శత్రువును కొట్టుటకు మనం శక్తివంచనలేక పాటుబడినపుడే ఇంగ్లాండు అమెరికాలు గూడ ఆ పని చేస్తాయి. ఇంగ్లాండు, అమెరికా, చీనాలు మూడు పూనుకొని ఎవరు చేయగల్చింది వారు చేస్తే జపానువారిని చివరకు ఓడింపవచ్చును. చీనాతోబాటు ఇంగ్లాండు అమెరికాలకుగూడ జపానువారు శత్రువులయినారను కారణమున మనపని మనం మానకుందుముగాక. మన చీనావారు రెండింతల కృషితో పనిచేయాలి."

"సినునూవాజిపావో" అను పత్రిక (సెప్టంబరు 27) అంతర్జాతీయ కార్మిక మహాసభకు పోయిన చీనా ప్రతినిధి చస్ హ్యూఫానుగారి అభిప్రాయములను యిట్లు ప్రకటించెను :—

"అంతర్జాతీయ కార్మిక మహాసభయు, లండను నౌకా మహాసభయు గూడ చీనావారి ధైర్యసాహసములను మెచ్చుకొన్నవి. చీనాకు సహాయం చేయాలను ఉద్యమాన్ని బ్రిటిషు ప్రజలును అమెరికా కార్మికులుగూడ చాల బలపరచిరి. ఇంగ్లాండులోనున్న చీనా నావికుల సేవను మెచ్చుకొని లండను నౌకా సభవారు, చీనా నావికులు మిత్రమండలి నావికులతో, సరిసమానమగు సౌకర్యములను పొందాలని నిర్ణయించిరి. బ్రిటనులోనున్న చీనా నావికుల జీతాలు నూటికి 75 వంతున పెంచబడెను. బ్రిటిషు సామాన్య ప్రజ చీనాపట్ల చాల సానుభూతి కల్గియున్నారు."

---

# జపాను సందిగ్ధావస్థ.

జపాను సేనలు పశిఫికు సముద్రములో కోరలు సీ యందు, మిడ్వే దీవివద్దను, సోలమన్సు దీవులందును, చీనాలోను పలుసార్లు వోడిపోయి నందునను, స్వస్థానానికి కడుదూరంవరకు పోవలసియుండుటచేతను జపాను చాల చిక్కులు పడుచున్నదని ఒక స్వీడను పత్రిక మిలిటరీ విలేఖరి వ్రాయుచున్నాడు.

అత డింకను యిట్లు వ్రాసెను :—తరువాత దాడి జపాను నాల్గుదేశాలపై చేయవచ్చును :— ఆస్ట్రేలియా, ఇండియా, చీనా, రష్యాలు. బర్మాను వారు ఆక్రమించిన పిమ్మట అక్కడ నుండి చీనా ముఖ్యపట్నమగు చుంగ్‌కింగుపై దాడిచేయుటకు ప్రయత్నించి విఫలు లయ్యిరి. హిందూమహా సముద్రంలోకి చొచ్చుకొనిపోయి దెబ్బ తినిరి. ఇండియాపైకి నేలమీదుగా దాడి వచ్చుట అసాధ్యంగానుంది. అందుచే ఇంక రష్యాపై దాడిచేసి యింకో శత్రువుని సంపాదించుకోవడమా అని జపాను ఆలోచిస్తున్నది. ఆస్ట్రేలియాపైని రష్యాపైని ఒకేసారి దాడిచేయుటకు జపానుకి విమానశక్తి చాలదు. జపాను యింతవరకు అనుసరించిన యుద్ధవ్యూహాలు చాల అయుక్తంగా జరిగినవి. కనుక జపాను యుద్ధ చర్యలు బాగుగా కొనసాగుటలేదని స్పష్టమగుచున్నది.

# బాంబులువేసే 'దోమ' విమానాలు.

బ్రిటిషువారు క్రొత్త బాంబరు విమానాలకు దోమలని పేరుపెట్టిరి. ఇవి యిపుడు పగలే అతిదూరంపోయి బాంబులు వేయడం ప్రారంభించేయి. ఫైటరు విమానాలు వెంట రానవసరం లేకుండ, శత్రు దేశంలో దిగువనుండే గుర్తులపై సూటిగా బాంబులువేసి చాల నాశనం కలుగచేస్తున్నాయి. అంతవడిగా అతిదూరం వచ్చు బాంబరులను జర్మనులు ఇంగ్లాండుపై ఎన్నడు పంపలేదు.

ఓస్లో నగరంలోవున్న జర్మను గూఢచారుల కేంద్రస్థానంపై యిటీవల రాయలు విమానదళం వారు గావించిన పట్టపగటి దాడియందు యీ 'దోమ' విమానాలు పేర్కొనబడ్డాయి సెప్టంబరు 8 వ తేదిన జర్మను అధికారులు యిట్లు ప్రకటించేరు —"రెండు బ్రిటిషు విమానాలు నేడు పగలే జర్మనీపై ఎగిరినవి. ఒక దోమ పడగొట్టబడెను". ఒకవారం గడచినాక బ్రిటిషు విమానశాఖ మంత్రిగారు, తమ "తేలిక బాంబరు విమానాలు" ఫిరంగి విమానాల సహాయం లేకుండ, మేఘాల చాటైనా లేకుండా సాయంకాలంపోయి వీసుబేడెను నగరంపై దాడి చేసినవని ప్రకటించిరి వీసుబేడెను లండనునుండి 400 మైళ్లదూరం ఉంది. అందులో ఎక్కువభాగం శత్రు రాజ్యంపై ఎగరాలి అయినను యీతేలిక బాంబరులలో ఒకటికూడ తప్పిపోలేదు చాల వడిగా పోగల తేలిక దోమ విమానాలే ఓస్లో పైకి పోయి, శత్రు ఫయిటరు విమానాలను తప్పించుకొని, జర్మనీ లోభాగానికిపోయి పగలే దాడిచేయ్యగలవు

ఓస్లోపోయి తిరిగి వచ్చుటకు 1,000 మైళ్లగును. అనగా దోమలు, లంకాష్టరు విమానాలవలె ఆగ్సుబర్గుపై దాడివంటి సుప్రసిద్ధమగు దాడి చేయగలవు తేలిక బాంబరులు లంకాష్టరులవలె ఎక్కువ బాంబులను మోయజాలవు. కాని 'దోమ' విమానాలు లంకాష్టరులకన్న వడిగ పోగలవు తక్కువమంది ప్రయాణంచేయుదురు. చవుకగ నిర్మించవచ్చును.

ఇపుడు దోమలు వాడుచున్నారు కనుక, తేలిక బాంబరులు మంచివో బరువయిన బాంబరులు మంచివో అనుభవంపై నిర్ణయింపబడగలదు. అమెరికానుండి వచ్చిన 'ఎగిరే కోటలను' యింకను ఎక్కువగా పగలే జర్మనీపైకి ఫయిటరు కాపలాలేకుండాపంపి ఎలా పనిచేస్తాయో చూడవలసియున్నది. బహుశః 'కోటలు' 'దోమలు' కూడ పగటిదాడులు చేయుటకు బాగా ఉపయోగపడగలవు

## బలవంతపు చాకిరి.

శత్రుదాడి నెదుర్కొనుటకుగాని, దాని ఫలితంగా జరిగిన నష్టం తొలగించుటకుగాని, పురోగమనదాడికిగాని, రక్షణకుగాని తోడ్పడునట్టి కార్యములన్నింటికి కావలసిన సహాయం ప్రజలనుండి కోరుటకు సేనానాయకులకు హక్కుగలదు అట్టి సందర్భాలలో మామూలు పద్ధతిని కూలివారిని సంపాదించుటకు సాధ్యంకాదు పని త్వరగా జరక్కపోతే ప్రమాదం హెచ్చును కావున సేనానాయకులు స్థానిక కార్మికులను ఎవరినైనా సరే ప్రాణప్రదమగు ఆ ముఖ్య కార్యములు చేయుటకు నియమింపవచ్చును అట్లా నియమింపబడిన కార్మికులందరికి పూర్తిగా వేతనాలివ్వబడును

## అమెరికా కార్మికుల తెలివితేటలు.

అమెరికాలో కార్మికుల తెలివితేటలవలన యుద్ధ పరిశ్రమలందు శ్రమతగ్గి యిదివరకు కన్న పని ఎక్కువ వడిగా జరుగుచున్నదని అధికారులు ప్రకటించుచున్నారు వారు 1,200 క్రొత్త సూచనలుచేయగ అందు 44 అనుసరించబడినవి

ఒక కార్మికుడు చేతితో ఫైలింగుచేయడంకి బదులు యంత్రంతో చేయడం మంచిదని క్రొత్త యంత్రమును సూచించెను దానివలన ఉత్పత్తి నూటికి నూరు హెచ్చింది

బోల్టుల తలపైని అతి నునుపుగాచేసి మెరుగుపెట్టవలసిన అవసరంలేదని యింకో మెకానికు సూచించెను అందువలన 16 సారులు చేస్తేగాని పూర్తిగాని పని 8 సారులు చేస్తే పూర్తియగుచున్నది

ఇంకో కార్మికుడు యంత్రంలో ఒకచోట చేయిపెట్టి చక్రాన్ని నిలుపుటకు బదులు స్థిరంగా నిలిపియుంచే సీలను కనిపెట్టెను అందువలన ఒక్కొక్క ఇంజనువలన జరిగేపని యిదివరకు కన్న నాల్గు గంటలు ముందే జరుగుచున్నది

పలకల రాయి ముక్కలలో నాఘాటవలె చెక్కడం పనికి కనిపెట్టబడిన క్రొత్త పద్ధతివలన అవి విరిగిపోవుట $\frac{3}{4}$ వంతు తగ్గిపోయెను.

విమానాలందు పనిచేయువారు అనేక వందల టన్నుల ఉక్కు ఖర్చు తగ్గించి, దానికి బదులు యింకొకటి వాడుక చేసే పద్ధతి కనిపెట్టిరి

# హిట్లరు కశిపుడు ఉక్కు స్తంభముల ధిక్కరించుట.

పురాణములలో చెప్పిన కథలు ఎన్నడో త్రేతాయుగంలోను కృతయుగంలోను జరిగిన తాతలనాటి పాత కథలనిన్నీ, యీ కాలంలో అవి నమ్మదగినవి కావనిన్నీ చాలమంది భ్రమపడుతూ ఉంటారు. కాని, అవి పాత కథలుకావు. అవి శాశ్వతమైన కథలు. అనేక అంతరార్థములతో పూరింపబడిన గాథలే యీ పురాణ గాథలు. ఆ కథలలో ఉన్న తత్వం మానవ జీవిత తత్వాన్ని, నిత్య నైమిత్తిక ప్రపంచ తత్వాన్ని, శాశ్వతమైన భగవల్లీలలుగా, మనకు బోధపరుస్తూ ఉంటుంది. పూర్వమెప్పుడో హిరణ్య కశిపుడనే రాక్షసుడు ఉండేవాడు. అతడు సామాన్యుడు కాడు. ఘోరమైన తపస్సుచేసాడు. తన తపశ్శక్తి వల్ల సమస్తలోకాన్ని జయించగల ప్రభావం సంపాదించాడు. తనకు మనుష్యులవల్లగాని, మృగాలవల్లగాని చావు రాకుండా గొప్ప వరము లను ఆ తపశ్శక్తివల్ల పొంది, తన్ను జయింప గలవాడు యీ లోకంలో లేడనే అహంకారంతో యావత్తు ప్రపంచాన్ని అట్టు మాడ్చినట్టు మాడ్చి వేస్తున్నాడు. ఈ అహంకారం మూలంగా, తన శక్తికి మించిన శక్తి యీ జగత్తులో ఇంకొకటి లేదన్నాడు. ఆఖరుకు సర్వశక్తి స్వరూపుడైన భగవంతుడుకూడా తానే అన్నాడు. తనకు మించిన భగవంతు డింకొకడు లేడని వాదించాడు. సర్వ శక్తుడైన భగవంతు డింకొకడు సర్వ వ్యాపియై యున్నాడని వాదించిన వాళ్లను బాధించాడు. "ఏడీ? యీ ఉక్కు స్తంభములో ఉన్నాడా? చూపించు" అని సవాలుచేసి, దానికొక తన్ను తన్నినాడు. ఆ ఉక్కు స్తంభంలో నుంచి అప్పుడు భగవంతుడు ఉగ్రమూర్తిగా ఉద్భవించి, నరుడుకాకుండా మృగంకాకుండా ఉండే నరసింహావతారం ధరించి, ఆ హిరణ్య కశిపుని చీల్చి చెండాడి, అహంకారమును అజ్ఞానమను అంతమొనర్చి, శాశ్వతమైన మానవలోక శాంతికి అహంకారం పనికిరాదని తెలియబరిచాడు.

ఆ కథ యావత్తూ ఏనాడో ఏ యుగంలోనో జరిగిందికాదు. ఈ నాడు, యీ కలియుగంలో మన కండ్లముందర జరుగుతూఉంది. స్టాలినుగ్రాడుతో హిట్లరు తన అహంకారం పూర్తిగా చూపిస్తున్నాడు. స్టాలినుగ్రాడును జయించి, కశిపియను సముద్ర తీరంవరకు తన సేనలను దండెత్తించవలెననిన్నీ, కశిపియను తీరానికి తాను చేరినపిమ్మట రష్యాయొక్క బలం సర్వ నాశనమై పోగలదనిన్నీ, కశిపియను తీరములో నున్న బాకూ అనే ప్రదేశంలో ఉన్న బ్రహ్మాండమైన కిరసనాయిలు గనులు తన వశమైనట్లయితే తన్ను జయించగలవాడు యీ ప్రపంచములో ఇంకొకడు లేడనిన్నీ హిట్లరు చాలా కాలంనుంచీ ఒక పెద్ద సంకల్పంతో ఉన్నాడు. కశిపియను సముద్రతీరమును చేరడంకోసం కలవరిస్తున్నాడు. హిట్లరుయొక్క లక్ష్యం, హిట్లరుయొక్క గురి కశిపియను సముద్రంమీద ఉంది. కశిపియను తీరప్రాంతం తన వశమైతే, హిట్లరు నిక జయించగలవారు లేరని హిట్లరు భ్రమపడుతున్నాడు. హిరణ్య కశిపుడు తపస్సుచేసినట్లుగా, హిట్లరు కశిపియను ప్రాంతంకోసం కలవరిస్తున్నాడు. ఆ యుగంలో హిరణ్య కశిపుడు వెలసినట్లుగా, యీ యుగంలో యీ హిట్లరు కశిపుడు అవతరించాడు.

బాకూలో ఉన్న కిరసనాయిలు గనులు రష్యాకు లేకుండా హిట్లరు వశపరచుకుంటే రష్యాకిక కిరసనాయిలు గనులు ఉండవని హిట్లరు భ్రమపడుతున్నాడు. అనేక రహస్యమైన కిరసనాయిలు గనులు ఇతర ప్రాంతాలలో రష్యాకు ఉన్నాయి. ఆ కిరసనాయిలు గనులు ఇదివరకే త్రవ్వబడి, ఆ గనులలోనుంచి కిరసనాయిలును రష్యా ప్రభుత్వం తీస్తూనేఉంది. ఏడు సంవత్సరాల క్రిందట రష్యా గనులలో సాలుకు 2½ కోట్ల టన్నుల కిరసనాయిలు తీశారు. 1938 వ సం॥లో ఆ గనులలోనుంచియే 3 కోట్ల టన్నుల కిరసనాయిలు తీశారు. అటు తర్వాత రెండు సంవత్సరాల కాలం గడచిన తర్వాత ఆ గనులలోనుంచి 3¼ కోట్ల టన్నుల కిరసనాయిలు సాలీనా తీశారు. 1942 వ సం॥లో 5 కోట్ల టన్నుల కిరసనాయిలు తీయుటకు అంచనా చేయబడింది. బాకూ కిరసనాయిలు గనులలో యీ 1942 వ సం॥లో లెక్కనుబట్టి చూస్తే సాలుకు 2 కోట్ల టన్నుల కిరసనాయిలుకంటె ఎక్కువ ఉత్పత్తికాదు. ఇవిగాక కాకసను పరగణాలో ఉన్న గ్రాజినీ కిరస

నాయిలు గనులున్నూ, మైకోపు కిరసనాయిలు గనులున్నూ కలిసి సాలుకు 1 కోటి టన్నుల కిరసనాయిలు సప్లయిచేస్తాయి. కాబట్టి (1) మైకోపు గనులున్నూ, (2) గ్రాజినీ గనులున్నూ, (3) బాకూ గనులున్నూ—యీ మూడున్నూ కలిసి సాలుకు 3 కోట్ల టన్నుల కిరసనాయిలు మాత్రమే సప్లయిచేస్తాయి. కాని, రష్యా మొత్తంమీద 1942 వ సం॥ అంచనా లెక్కలను బట్టి సాలుకు 5 కోట్ల టన్నుల కిరసనాయిలు ఉత్పత్తి అవుతూవున్నది. కనుక మిగతా 2 కోట్ల టన్నుల కిరసనాయిలున్నూ రష్యాకు సాలీనా ఎక్కడినుంచి ఉత్పత్తి అవుతూఉన్నది. ఒక్క బాకూ కిరసనాయిలు గనులలోనే సాలీనా 2 కోట్ల టన్నుల కిరసనాయిలు లభిస్తూఉన్నది. కనుక, బాకూ గనులలో లభించుచున్నంత కిరస నాయిలు, రష్యాకు కాకససు పరగణాలోలేకుండా, యితర ప్రాంతాలలో లభిస్తున్నదని లెక్క తేలు చున్నది. కాకసను పరగణాలోని పైజెప్పిన (1) మైకోపు, (2) గ్రాజినీ, (3) బాకూ గనులు హిట్లరుకు వశమైనప్పటికిన్నీ, బాకూ గనులలో సప్లయి అవుచున్నంత కిరసనాయిలు సప్లయి కాగల ఇతర గనులు రష్యాకు ఇతర ప్రాంతా లలో ఉన్నవని నిర్ధారణగా అర్థమవుతూ ఉన్నది. కాబట్టి కశపియను సముద్ర తీరంవరకూ హిట్లరు కశిపుడు వశపరచుకొన్నప్పటికీ, రష్యా ప్రభు త్వానికి బాకూతో సమానమైన కిరసనాయిలు సప్ల యి గనులు ఇతర ప్రాంతాలలో కొన్ని ఉన్నాయి. హిట్లరు కశిపుని జయించగల బాకూ ఇంకొకటి రష్యాచేతులో ఉంది.

రష్యాకు ప్రధానిగానున్న స్టాలిను అంటే నాజీ దండయాత్రలకు చలించేవాడుకాడు. అతని అసలు పేరు అదికాదు. స్టాలిను అనేది పౌరుష గౌరవ నామం, “స్టాలిను” అనే మాటకు ఉక్కు మనిషి అని అర్థం. స్టాలినుయొక్క గౌరవ సంస్మరణార్థంగా అతని పేరు ఒక ముఖ్యమైన పట్టణానికి పెట్టబడింది. ఆ పట్ట ణమే స్టాలిన్‌గ్రాడు. ఈ స్టాలిన్‌గ్రాడు పట్ట ణంలో ప్రతియిల్లు ప్రతి వీధి శత్రువుల కభేద్యం గా దట్టమైన ఉక్కు రేకులతో కప్పబడిన అష్ట గోడలతో కట్టుదిట్టంగా బందోబస్తు చేయబడి ఉంది. స్టాలిన్‌గ్రాడు నగరం అంటే ఉక్కు గోడుల పట్టణం. ఉక్కు ముక్కలవంటి రష్య నులు చెక్కు చెదరకుండా మొక్కవోని ధైర్యం తో ఆ బాలగోపాలం పోట్లాడుతున్నారు. ప్రతి రోజూ 1,000 జర్మను విమానాలు బాంబుల వర్షం పైనుంచి కురిపిస్తూ, వందలకొలది జర్మను ఫిరంగి మోటార్లు అగ్నివర్షం కురిపిస్తు యుద్ధం చేస్తున్నప్పటికీ, స్టాలినుగ్రాడు పట్టణంలో జర్మ నులు ఒక అడుగుముందు వెయ్యడం అసా ధ్యంగా ఉంది. ముక్కు పచ్చలారని చిన్న చిన్న ఆడపిల్లలు సహితం మరఫిరంగులవద్ద పనిచేస్తున్నారు. హిట్లరు సేనలు, దినమునకొక భవనం ఆక్రమించడానికి, వేన వేలుగా నాశన మవుతున్నారు. హిట్లరు కశిపుడు తన్నిన ఉక్కు గోడల ఉక్కు మనుష్యుల పట్టణంలోనుంచి ఉగ్ర మైన రష్యను శౌర్యం ఉద్భవించింది. ఈ అగ్ని జ్వాలల మధ్య జ్వాలా నరసింహరూపం దాల్చిన రష్యను శౌర్య ప్రతాపాగ్నికి హిట్లరు కశిపుని అహంకారం ఆహుతి అవుతోంది. ఈ మహా లయ పక్షంలో నాజీ మహాలయానికి స్టాలినుగ్రాడు మహా నరసింహాలయంగా ఉంది.

## మదరాసీ లాంసు నాయక్‌నకు బిరుదు.

లాంసు నాయకు చొక్కలింగం, 9 వ ఇండియను ఇంఫాంట్రి బ్రిగేడు సిగ్నలు సెక్షంకి చెందిన హిందు తమిళ దేశీయుడు, మధుర జిల్లా, మేలుమంగలం గ్రామం నుండి వచ్చినవాడు, పడమటి ఎడారి యు ద్ధంలో ప్రశంసాపాత్రంగా సేవచేసినందున ఐ.డి.ఎస్. (ఇండియను డిఫెంసు సర్వీసు) మెడలు బహుమతిగ నొసంగబడెను.

# సైనికుల జీతాల వృద్ధి.

## ఈ యుద్ధం వచ్చినాక మూడోసారి జీతాలు పెంచుట.

1942 వ సం॥ సెప్టంబరు 1 వ తేదినుండి భారతీయ సైనికులందరికి నానుకాంబ టెంట్సుగా చేర్చుకొనబడిన వారికి బేసికు జీతం నెలకు రూ 2 లు చొప్పున వృద్ధిచేయబడింది.

> ఇదివరకు ఏడాది పనిచేసినాక సమర్థత జీతమని నెలకు రూ 2-8-0 లు అధికం యిస్తూవుండే వారు ఇపుడది మార్చి, ఆరు నెలల పనిచేసినాక నెలకోరూపాయి తరువాత ఏడాదికో రూ 3-8-0 లు చొప్పున అధికం యిస్తారు నానుకమీషండు ఆఫీసరులకు యిదివరకు మంచి సేవ చేసినందుకు జీతం యిచ్చే నిబంధనల్లు మార్చబడ్డాయి ఇదివరకు 2, 4, 6 సంవత్సరాలకోసారి యీ జీతం యిచ్చేవారు యికముందు 1, 2, 3 ఏండ్ల సర్వీసుకాగానే యిస్తారు.
> ఇటీవల ధరలు పెరిగినందున, ఇండియాలోనేయుండు భారతీయ సైనికులకు శాంతి సమయంలో రేటు చొప్పున భత్యాలు పుచ్చుకొనుచున్నవారి అలవెన్సు నెలకు రూ 2 లునుండి రూ 3 లువరకు పెంచబడింది. ఈ హెచ్చింపులవలన సైన్యం జీతాల ఖర్చు సాలీనా మొత్తం $5\frac{3}{10}$ కోట్లు హెచ్చింది. ఈ యుద్ధం వచ్చినాక జీతాల వృద్ధి జరుగుటకు యిది మూడోసారి.

అదివరకోసారి జీతాలు పెంచినపుడు నెలకు 10 అణాలు యిస్తున్న భోజనం అలవెన్సు రూ 2 లు వరకు పెంచబడింది, సైనికుని భావి స్థితి కాపాడుటకిచ్చు డిఫర్డుపే నెలకు రూ. 1 నుండి రూ 3 లు వరకు పెంచబడింది. యుద్ధానంతరం సిపాయికి వాని సంఘంవారికి ఉపయోగార్థం వినియోగించే నిధికొరకు ప్రభుత్వంవారు ప్రతి ఒక సిపాయికి తాము రూ 2 లు జమ కట్టుతూవుంటారు. అదివరకు తొలిసారి ఉచితంగా దుస్తులిచ్చి, తరువాత దుస్తులకుగాను నెలకు రూ 2 లు యిచ్చి అందులోనే సిపాయిలకు అదనంగా కావలసిన దుస్తులు ఘట్టించుకొనే పద్ధతి ఉండేది. ఇపుడు దానికి బదులు కావలసిన దుస్తులన్ని ఉచితంగా యిస్తున్నారు.

భారతీయ సైనికుడికి అందే జీతంలో అనేక అలవెన్సులతో కూడియుండును. చేరగానే అతని బేసికు జీతం నెలకు రూ 18 లు ఆరు నెలలయినాక అతడు నెలకు రూ 2-8-0 లు అదనంగా తీసుకోవచ్చును. యుద్ధరంగానికి పోకుండాయున్న సైనికుడు, పై రెండు కాక, నెలకు భోజనం అలవెన్సు రూ 3 లు, క్షవరం అలవెన్సు అ 10 లు యిత్తురు. ఇదంతాకాక సర్వీసులో ఉన్నంతకాలం నెలకు రూ 3 లు డిఫర్డు పే యిస్తారు. అతని తరపున ప్రభుత్వం వారు నెలకు రూ 2 లు, పునరుద్ధరణ నిధియందు జమ చేస్తారు. కావున యుద్ధరంగంలో లేకుండా మకాములలోనున్న సైనికుడు ఒక్కొక్కనికి ప్రభుత్వంవారు నెలకు రూ 26-10-0 లు యిస్తారు. ఒక ఏడాది గడిస్తే రూ 30-2-0 లు యిస్తారు.

సిపాయి యుద్ధరంగానికి పోతే ఇండియాలో భత్యాలు ఎక్కువగా నెలకు రూ 5 లు చొప్పున యిస్తారు. కావున యుద్ధరంగంలో సేవచేయుచున్న సైనికుడు ఏడాది సర్వీసున్నచో నెలకు రూ 31-8-0 లు గణించును. విదేశాలందు సేవకుపోతే యింకో రూ 7 లు నెలకు అధికంగా యివ్వబడును. కనుక విదేశాలందు పని చేయుచున్న భారతీయ సైనికుడు రూ 21 లు నెలలు పైగా సర్వీసుంటే మొత్తం రూ 8-8-0 లు గైకొనును. విదేశాలలో సిపాయిలు నగదు రూ 33-8-0 లు, లాంసు నాయక్ రూ 35-8-0 లు, నాయకు రూ 45 లునుండి రూ 48 లు వరకున్ను, హవల్దారు రూ 49 లునుండి రూ 53 లువరకున్ను పుచ్చుకుంటారు.

జీతమేగాక, సైనికులందరికి ఉచితంగా భోజనం పెట్టి దుస్తు లివ్వబడును. ఎక్కడికిపోయినా ఉచిత ప్రయాణసౌకర్యము లొసంగబడును. మునిసిపాలిటీ పన్నులు వారికుండవు, అవసరమయితే వంటచరకు ఉచితంగా యివ్వబడును. వస్తురూపంగా యిచ్చే సౌకర్యాలే లెక్కవేసుకుంటే ప్రతి ఒక సిపాయికి నెలకు రూ 21 లు అగును. యుద్ధరంగంలోగాని, విదేశాలందుగాని పనిచేయుచున్న వానికి యింకా ఎక్కువగును.

వస్తువుల సప్లయివలన సిపాయికి చాల చేతి డబ్బు మిగులును. అంతేకాక ధరలు పెరుగుటవలన వారికి నష్టముండదు. అయినను యింటివద్ద భార్యా బిడ్డలను పెద్ద కుటుంబాలను పోషించవలసిన సిపాయిలకు ధరలు పెరుగుటవలన నష్టముండును. కావుననే వారికిపుడీ వేతనాభివృద్ధి క్రొత్త సౌకర్యములు ఒసంగబడినవి.

1939 వ సం॥ సెప్టంబరునుండి యిప్పటివరకు యిచ్చిన వేతనాభివృద్ధివలన సాలీనా 10 నుండి 11 కోట్ల రూపాయలవరకు అధికంగాఖర్చగుచున్నది.

# సిపాయి దుస్తులలోనున్న పౌరులే.

## సోల్జరుల సదుపాయాలగూర్చి వావెలు సేనాని ఉపన్యాసం.

భారత సర్వసేనాధిపతియగు సర్ ఆర్చిబాల్డు వావెలుగారు యీ వారం ఢిల్లీలో ప్రయాణమందున్న సైనికుల సదుపాయానికై స్థాపించబడిన ఫలహారాల మందిరం తెరచుచు, సైన్యానికి గల బాధ్యతలూ కష్టాలగూర్చి నుడివిరి.

"నేడు ఇండియాలోనున్న సైనికులు భారతీయులు బ్రిటిషువారుకూడ, సిపాయి యూనిఫారము ధరించిన మామూలు పౌరులేయన్న విషయం పలువురు గుర్తించుటలేదు. భారతీయ సైనికులు ఐచ్ఛికంగా సైన్యంలో చేరినవారే. కాని వారిపుడు అన్ని జాతులు తరగతులనుండి వచ్చి చేరుచున్నారు కనుక, యిదివరకుకన్న యిపుడెక్కువగ భారతీయ సైన్యం భారత జాతికంతకు ప్రాతినిధ్యం వహించుచున్నది. నేటి సైన్యం పౌరుల సైన్యమేకాని, కేవలం సైనిక తరగతులతోకూడిన సైన్యం కాదు.

"అట్లే బ్రిటిషు సోల్జర్లు ఆఫీసరులుగూడ, ఇండియాలో పనులుచేసుకుంటున్న బ్రిటిషువారు తమ పనులు మానుకొని, కుటుంబాలను విడచి యుద్ధంలో చేరినవారే, వారు క్రొత్త దేశానికివచ్చి, యిచటి ఎండకు ఆచారాలకు అలవాటుపడనివారు కనుక, మన సానుభూతి సహాయాలను పొందుటకెంతయు అర్హులు.

"ఇండియాలో సైనికునకు చేయవలసినదంతా చేయలేదని విమర్శలు వెలువడుతూ వుంటాయి. ఈ యుద్ధం జరిగిన మొదటి రెండున్నర వత్సరాలు, ఇచట సైన్యాలకు శిక్షణ యొసంగి విదేశాలకు పంపుటే జరుగుచుండెను. విదేశాలందున్న మన సైనికుల సహాయానికి అచట భారతీయులు బ్రిటిషువారు ముఖ్యంగా స్త్రీలు ఎంతో పాటుబడుచున్నారు. జపాను యుద్ధంలో దిగుటచేత, వేలకొలది బ్రిటిషు అమెరికను మిత్ర మండలి సేనలు, వైమానికులు ఇండియా రక్షణకై రావలసివచ్చెను. సైనిక సంఖ్య యింత పెరిగినపుడు వారి అవసరాలకు సాదుకొనుట చాల కష్టము. వారికి హాయినిచ్చు వస్తువులు విదేశాలనుండి తెప్పించుటకు నౌకలులేవు. వారికీదేశంలో తగు వ్యాయామం కాలక్షేపములకు తగు సదుపాయాలు చేయుటయూ కష్టమే.

"ఈ సమస్యను మేము ఐచ్ఛిక సేవకుల సహాయమున చాలవరకు ఎదుర్కొని పరిష్కరించుచున్నాము. అధికారులు అధికారేతరులుగూడ శక్తి వంచనలేక పాటుబడి యీ కష్టం తొలగింతురు. కాఫీ హోటల్సు, పేకాట క్లబ్బులు, మున్నగు సదుపాయాలకన్న తాను పోయినచోట ఎక్కువ అభిమానంతో ఆదరించి తోడి దేశీయునిగను మిత్రునిగను చూసుకుంటే, సైనికుడు ఎక్కువ సంతసిస్తాడు. తమ దేశానికి త్యాగం చేస్తున్నవాడిగా గుర్తించబడితే చాలు. సోల్జరు ఏ దేశంవాడు ఏహోదా వాడయినా సరే స్వదేశంలోనున్నట్లు భావించుకోగలంత ఆదరణచూపితే, సైనికులంతా మంచి ఉత్సాహంగా నుంటారు. భారతదేశ సైన్యం అపుడు మంచిదశలో నుండగలదు."

---

## మద్రాసు పటాలములలో జనహాని.

వేర్వేరు తేదీలయందు మద్రాసు పటాలములలో యీ క్రింది రీతిగా జనహాని కలిగినదని తెలియజేయుటకు చింతిల్లుచున్నాము:—

వైస్రాయి కమిషను ఉద్యోగులు.

చనిపోయినవారు.

| నెంబరు | హొదా. | | పేరు |
|---|---|---|---|
| ఇండియను ఇంజనీరు— | | | |
| 49202 | సబ్ | | ఆర్ కుప్పన్ |

ఇతర తరగతులు.

చనిపోయినవారు.

| నెంబరు | హొదా. | | పేరు |
|---|---|---|---|
| మదరాసు సేపర్లు, మైనర్లు— | | | |
| 1494 | వంటు | ... | శల్వమణి. |
| 65165 | సేపరు | | సుందరం |
| ఇంజనీర్లు— | | | |
| 43437 | లా/నా | .. | పి వి గోపాల కురుప్. |
| 104145 | .. | | రాము మాలి |
| 63940 | సేపరు | ... | సుబ్రహ్మణ్య పిళ్లై |
| ఇండియను సిగ్నలు కోరు— | | | |
| 55306 | | | పి. ఎం చకో |
| ఐ ఎ ఓ.సి — | | | |
| ఎం.టి/971511 | డ్రైవరు | ... | సామిముత్తు |
| ఐ జి యస్.సి — | | | |
| జి.ఎస్ ఎఫ్./1764 | వెయిటరు | . | ఎస్. ఎల్ దొరై స్వామి |
| అగ్జిలరీ పయినీరు కోరు— | | | |
| 117427 | కార్మిక | | రంగస్వామి |

PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS AND PUBLISHED BY THE DIRECTOR OF WAR PUBLICITY, "VICTORY HOUSE", MOUNT ROAD, MADRAS